శ్రీ

# కుసుమాంజలి.

(క్రిందితరగతి బాలురచే వల్లింపఁజేయఁదగు పద్యములు).

సంగ్రథకుఁడు:

పిన్నంరాజు వేంకట సుబ్రహ్మణ్య శర్మ

సాహిత్యశిరోమణి

ప్రధానాం[illegible]

బోర్డు [illegible] పాఠశాల

ప్రకాశకులు:

మేనేజరు

వాయునందన ప్రెస్, కావలి.

1933.



[వెల 0-1-0.

# తొలిపలుకు.

భాష వాచోవిధేయమగుటకుఁ బెద్దలరచనలు కొన్ని ముఖస్థముచేయక తప్పదు. ఇది సాంప్రదాయ సిద్ధమేగాని నూత్నవిధానము గాదు. ఇట్లు వల్లించుట బాల్యమందు మాత్రమే సాధ్యమగు. రచనలు జ్ఞానభక్తి నీతియుక్తము లగునేని బంగరునకు మెఱుఁగిడుటగు. ఉత్తరకాలమందు విద్యార్థులకవియెంతయు నుపయోగించును. పాఠశాలయందిటీవల ఈ మార్గము నుపేక్షించిరి. తత్ఫలముగా, బి. ఏ. విద్యార్థులకుఁ గూడ పద్యసమన్వయశక్తి దుర్లభమైనది. అట్టి కొఱఁతఁ దీర్చి భాషాజ్ఞానము స్ఫుటమగునట్లు చేయుట పఠనీయగ్రంథ నిర్ణేతలకు విధివిధానము. శ్రీ సుబ్రహ్మణ్యశర్మగారిట్టితలంపుతో నీ కుసుమాంజలిఁ గూర్చిరి. ఇందలి పద్యములు 4-5 తరగతులకును, మొదటిఫారమునకు నుపయోగించును. ఈ గ్రంథము వలయుమన్ననఁ బడయుఁగాక. విద్యార్థులిందలి పద్యంబులు వల్లించి లాభముఁ బడయుదురు గాక.

కావలి
1—7—1933.

(Sd.) దొడ్ల వేంకటరామరెడ్డి.

శ్రీమాత్రేనమః.



# కుసుమాంజలి.

## ధ్యాన శ్లోకములు.

శ్లో॥ నమో బ్రహ్మణ్యదేవాయ గోబ్రాహ్మణ హితాయ చ ,
జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయ నమోనమః . 1

,, భూతలాతలమధ్యస్థౌ హత్వా తు మధుకైటభౌ ,
ఉద్ధృతా యేన వై వేదాస్తస్మై మత్స్యాత్మనే నమః. 2

,, ససాగరవనాం బిభ్రత్సప్తద్వీపాం వసుంధరాం ,
యో ధారయతి పృష్ఠేన తస్మై కూర్మాత్మనే నమః . 3

,, ఏకార్ణవే హి మగ్నాం గాం వారాహం రూప మాస్థితః ,
ఉద్దధార మహీం యోఽసౌ తస్మై క్రోడాత్మనేనమః . 4

,, నారసింహవపుః కృత్వా యస్త్రైలోక్యభయంకరం ,
హిరణ్యకశిపుం జఘ్నే తస్మై సింహాత్మనే నమః . 5

,, వామనం రూప మాస్థాయ బలిం సంయమ్య మాయయా,
ఇమేక్రాంతాస్త్రయో లోకాస్తస్మైక్రాంతాత్మనే నమః. 6

,, జమదగ్నిసుతో భూత్వా రామఃపరశుధృగ్విభుః ,
సహస్రార్జునహంతైవ తస్మా ఉగ్రాత్మనేనమః . 7

శ్లో॥ రామో దాశరథి ర్భూత్వా పౌలస్త్యకులనందనం,
జఘాన రావణం సంఖ్యే తస్మై క్షత్రాత్మనే నమః . 8
,, వసుదేవసుతశ్శ్రీమాన్ వాసుదేవో జగత్పతిః,
జహార వసుధాభారం తస్మై కృష్ణాత్మనేనమః . 9
,, బుద్ధరూపం సమాస్థాయ సర్వరూపపరాయణః,
మోహయత్సర్వభూతాని తస్మైబుద్ధాత్మనే నమః . 10
,, హనిష్యతి కలే రంతే మ్లేచ్ఛాం స్తురగవాహనః,
ధర్మసంస్థాపనార్థాయ తస్మై కల్క్యాత్మనే నమః . 11

---

## ధ్యా న ప ద్య ము లు.



చ॥ కమలదళాక్ష! దుఃఖలయకారణమై తగు తావకీన రూ
పము ననివార్యదుర్భర విపద్దశ దుఃఖమునొందు మాకు నీ
సుమహిత సత్కృపాగరిమఁ జూపుటకంటె ననుగ్రహంబు లో
కమునఁ దలంప నొండొకటి గల్గునె భక్తఫలప్రదాయకా. 12

ఉ॥ భూరిశివేతరాపహవిభూతిసమేత మహాత్మ దీనర
క్షారతి నొప్పనీవు చిరకాలమునన్ సుఖవృత్తివీరు మా
వారలటంచు బుద్ధి ననవద్య తలంచిన యంతమాత్రి స
త్కారమెచాలు సట్లగుట గాకిటు సన్నిధివైతి వీశ్వరా. 13

చ॥ అరయఁగ శుద్ధిభూత హృదయంబుల్గందుల సంతరాత్మవై
తిరముగనుందునీవు భవదీయ పదాంబురుహద్వయార్చనా
పరమతులైనమాకును శుభప్రదభూరి మనోరథంబు లీ
వెఱుఁగవె భక్తలోకహృదయేప్సితదాయకముక్తినాయకా

చ॥ హరి భవదీయ మాయననయంబును జెందిననేము నిచ్చలుం
గరమనురక్తి నేది తుదగా భవకర్మ్ములమై ధరిత్రిపైఁ
దిరుగుదు మంతదాఁక భవదీయజనంబులతోడి సంగతిన్
గురుమతి జన్మజన్మములకున్ సమకూరఁగఁ జేయు మాధవా.

మ॥ కమలాధీశ్వర తావకీన వరభక్తవ్రాత సంసర్గ లే
శముతోడన్ సరిగాఁ దలంప మెలమిన్ స్వర్గాపవర్గాది సౌ
ఖ్యము లన్నన్ విను మానుషంబు లగునీకామంబులం జెప్ప నే
ల మునీంద్రస్తుతపాదపద్మ సుజనాలాపాను మోదాత్మకా.

చ॥ వనరుహపత్త్రలోచన భవత్సఖుఁడైన సుధాంశుమౌళితో
డి నిమిషమాత్ర సంగతిఁ గడిందివ్రణంబును దుశ్చికిత్సము
న్ననఁ దగుజన్మరోగమున కగ్గలి వైద్యుఁడవైన నిన్ను నే
మనయముఁ జూడఁ గంటిమి కృతార్థులమై తగమంటి మీ
శ్వరా. 17

ఉ॥ ఎల్లశరీరధారులకు నిల్లను చీఁకటి నూతిలోపలం
ద్రెళ్ళక వీరు నే మనుమతిభ్రమణంబున భిన్నులై ప్రవ
ర్తిల్లక సర్వము న్నతనిదివ్యకళామయ మంచు విష్ణు నం
దుల్లముఁ జేర్చి తా రడవి నుండుట మేలు నిశాచరాగ్రణీ. 18

సీ॥ మందారమకరంద మాధుర్యమునఁ దేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మల మందాకినీ వీచికలఁ దూఁగు
రాయంచ చనునె తరంగిణులకు
లలితరసాలపల్లవ ఖాదియై చొక్కు
కోయిల చేరునే కుటజములకుఁ

బూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరకం
బరుగునే సాంద్ర నీహారములకు

తే॥ నంబుజోదర దివ్య పాదారవింద
చింతనామృత పాన విశేషమత్త
చిత్త మేరీతి నితరంబుఁ జేర నేర్చు
వినుతగుణశీల మాటలు వేయు నేల. 19

మ॥ తనుహృద్భావల సఖ్యముల్ శ్రవణముల్
దాసత్వముల్ వందనా
ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయుల్
సంకీర్తనల్ చింతనం
బను నీతొమ్మిది భక్తిమార్గముల సర్వాత్ముల్ హరిన్ నమ్మి స
జ్జనులై యుండుట భద్రమంచుఁ దలఁతుల్
సత్యంబు దైత్యోత్తమా. 20

సీ॥ కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకునిఁ జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు
మధువైరిఁ దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు
పురుషోత్తముని మీఁది బుద్ధి బుద్ధి

తే॥ దేవదేవుని జింతించు దినము దినము
చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు

కుంభినీధవుఁ జెప్పెడిగురుఁడు గురుఁడు
తండ్రి హరిఁజేరు మనియెడి తండ్రి తండ్రి. 21

సీ॥ కంజాక్షునకుఁ గాని కాయంబు కాయమే
పవనగుంఫిత చర్మభస్త్రి గాక
వైకుంఠుఁ బొగడని వక్త్రంబు వక్త్రమే
ఢమఢమధ్వనితోడి ఢక్క గాక
హరిపూజనము లేని హస్తంబు హస్తమే
తరుశాఖనిర్మిత దర్విగాక
కమలేశుఁ జూడని కన్నులు కన్నులే
తనుకుడ్యజాల రంధ్రములు గాక

ఆ॥ చక్రిచింత లేని జన్మంబు జన్మమే
తరళసలిల బుద్బుదంబు గాక
విష్ణుభక్తి లేని విబుధుండు విబుధుఁడే
పాదయుగము తోడి పశువు గాక. 22

సీ॥ సంసార జీమూత సంఘంబు విచ్చునే
చక్రిదాస్య ప్రభంజనము లేక
తాపత్రయాభీల దావాగ్ని లారునే
విష్ణుసేవామృత వృష్టి లేక
సర్వంకషా ఘౌఘ జలరాసు లింకునే
హరిమనీషా బడబాగ్ని లేక
ఘనవిప ద్గాఢాంధకారంబు లడఁగునే
పద్మాక్షునుతి రవి ప్రభలు లేక

తే॥ నిరుపమా పునరావృత్తి నిష్క శంక
ముక్తినిధిఁ గాన వచ్చునే ముఖ్యమైన
శార్ఙ్గ కోదండ చింతనాంజనము లేక
తామరస గర్భునకు నైన దానవేంద్ర. 23

ఉ॥ అచ్చపుఁ జీఁకటిం బడి గృహావ్రతులై విషయప్రవిష్టులై
చచ్చుచుఁ బుట్టుచుం మరల చర్విత చర్వణులైన వారికిం
జెచ్చెరఁ బుట్టునే పరులు సెప్పిననైన నిజేచ్ఛనైన నే
మిచ్చిన నైనఁ గానలకు నేఁగిననైన హరిప్రబోధముల్.24

ఉ॥ విశ్వము లీలఁ ద్రిప్పుచు నవిద్యకుఁ జుట్టమవైన నీకుఁదా
శాశ్వతమైన కాల మిది సర్వము వేడబ మందు రట్టి వి
శ్వేశ్వర! మేలుకుప్ప! నిను నెవ్వఁడుఁగోరి భజించు వాఁడవో
శాశ్వతలక్ష్మి మృత్యు జయ సౌఖ్యహితుం డభయుండు
మాధవా. 25

ఆ॥ విలయకాలమందు విశ్వంబు నీపెద్ద
కడుపులోన దాఁచు కడిమిమేటి
నటుఁడ వీవు నేఁడు నాగర్భజుఁడ వోట
పరమపురుష వేడబంబు గాదె. 26

క॥ ఘోటకవదనుఁడవై మధు
కైటభులం దున్మి నిగమగణముల నెల్లం
బాటించి యజున కిచ్చిన
కూటస్థుఁడ వీశ్వరుఁడవు కోవిదవంద్యా. 27

క॥ ఒకపరి జగముల వెలినిడి
యొకపరి లోపలికిఁ గొనుచు నుభయముఁ దానై

సకలార్థసాక్షి యగు న
య్యకలంకుని నాత్మమూలు సర్థిఁ దలంతుర్. 28

క॥ యోగాగ్ని దగ్ధ కర్ములు
యోగీశ్వరులే మహాత్ము నొం డెఱుఁగక స
ద్యోగవిభాసిత మనముల
బాగుగ వీక్షింతు రట్టి పరము భజింతుర్. 29

క॥ కలఁ డందురు దీనులయెడఁ
గలఁ డందురు పరమయోగిగణముల పాలం
గలఁ డందు రన్ని దిశలను
గలఁడు కలం డనెడువాఁడు గలఁడో లేఁడో. 30

క॥ వినుదఁట జీవులమాటలు
చనుదఁట చనరాని చోట్ల శరణార్థులకో
యనుదఁట పిలిచిన సర్వముఁ
గనుదఁట సందేహ మయ్యెఁ గరుణావార్థీ. 31

ఆ॥ మంచివారి కెల్ల మంగళప్రద లయ్యెఁ
గల్లరులకు మేలుగాని యట్టి
తనువు లెన్ని యైనఁ దాల్చి లోకములకు
సేమ మెల్లప్రొద్దుఁ జేయు దీవ. 32

ఆ॥ వరమునీంద్ర యోగివరసురకోటిచే
వర్ణితప్రభావ వైభవంబు
గలిగి యఖిలచేతనులకు విజ్ఞానప్ర
దుండ వగుదు వభవ దురితదూర. 33

ఆ॥ వితతరాజ్యగరిమ విడిచి కాననముల
నాత్మలందు మీపదాబ్జయుగము
వలఁతి గాఁగ నిలిపి వాతాంబు పర్ణాశ
నోగ్ర నియతు లగుచు నుందు రభవ. 34

ఆ॥ జలజనాభ! సకలజగ దంతరాత్మవై
నట్టి దేవ నీపదారవింద
యుగళి సానురాగయుక్తమై నామదిఁ
గలుగు నట్లుగాఁగఁ దలఁపు మనఘ!. 35

## నీ తి ప ద్య ము లు.

తే॥ బ్రహ్మచర్యంబుకంటెను బరము మద్య
మాంసములు రెండు నుడుగుట మనుజనాథ
లోకయాత్ర వాటించు చలోలుపతయు
శమముఁ గల్గి వర్తించుట శౌచవిధము. 36

క॥ నృపవర! పూర్వాహ్ణంబును
నపరాహ్ణము దేవపితృ సమారాధన వి
ధ్యుపదిష్టకాలములు మ
ధ్యపుసమయము మానుషార్చనార్హంబరయన్. 37

క॥ జనులకు నిందుఁడు గ్రహముల
కినుఁడును బితరులకు నోషధీశుఁడుఁ బోలెన్
మనుజోత్తమ! కడు నెక్కుడు
వినుము నదులకెల్ల జాహ్నవి మహత్త్వమునన్. 38

ఆ॥ విష్ణుపదమువలన విధునివలన సూర్యు
వలన మేరురూపకలితుఁ డైన
విష్ణువలనఁ దిత్రిపురవిజయు మౌళివలన
నుండి హిమనగమున నొలసె గంగ. 39

క॥ అడుగక యున్నను నాలిం
గొడుకుల రక్షింప లేక కుతిలపడుచు నె
ప్పుడుఁ బేదతనము గల నరు
నెడ రుడుపఁగ వలయు నది మహితగుణ మనఘా!. 40

చ॥ అడిగిన నిచ్చు కంటెను నయాచకుఁగాఁగ నెఱింగి యిచ్చుటె
క్కుడు ఫలమిచ్చు దానవిధికోవిద! వేఁడుట సావు వేఁడగాఁ
బడు టది పెద్దసావు దగు పాత్రవపూర్ణము సేయు నాతఁడా
యడిగినవానిఁదన్నును దయారతిఁ గావఁగఁ జాలువాఁడగుట్

క॥ నగభులలోపలి మాటలు
దగునే వెలి నుగ్గడింపఁ దన కేర్పడ నొం
డుగడం బుట్టినఁ బతి విన
నగుపని చెప్పెడిది గాక యాతనితోడన్. 42

ఆ॥ ఆవులింత తుమ్ము హాసంబు నిష్ఠీవ
నంబు గుప్తవర్తనములు గాఁగఁ
జలుపవలయు నృపతి గొలువున్నయెడల బా
హిరములైనఁ గెలని కెగ్గు లగుట. 43

క॥ ఏలినవానిని దైవము
నాలిని బంధులను సముచితారాధనసం

శీలతఁ బ్రీతులఁ జేయని
పాలసుఁ డాఫలము లానపడు మనుజేంద్రా ! 44

క॥ ఎదిరికి హితమును బ్రియమును
మది కింపునుగాఁగఁ బలుకుమాటలు పెక్కై
యొదవినను లెన్న యటు గా
కిది యది యన కూర కునికి యెంతయు నొప్పున్ 45

తే॥ పాడి గలిగిన నిహలోకఫలము లెల్లఁ
జేరుటయె కాదు కీర్తియుఁ జెందుఁ బురుషు
ధరణిఁ బొగడిత యెందాఁకఁ బరఁగు నంత
కాలమును బుణ్యలోకంబు గల్గు నందురు 46

తే॥ నియతతపమును నింద్రియ నిగ్రహంబు
భూరివిద్యయు శాంతికిఁ గారణములు
వానియన్నిటి కంటె మేలైన శాంతి
కారణము లోభ ముడుగుట కౌరవేంద్రా ! 47

క॥ జయ మగు నోడుదు మను ని
శ్చయ మొక్కఁడు లేదు వినుము సమరమునఁ బరా
జయము మరణంబుకంటె హృ
దయపుటభేదనము సేయుఁ దథ్యం బనఘా ! 48

క॥ కలిమియ చుట్టలఁ జేర్చుం
గలిమియ చెలులను ఘటించుఁ గలిమియ శౌర్యో
జ్జ్వలుఁడనిపించుం గలిమియ
పలువురు సద్బుద్ధియనఁగఁ బరఁగం జేయున్ 49

క॥ గరదుని గృహదాహకు మం
త్రిరహస్యవిభేది వధవిధాయిఁ బరసతీ
హారు బంధుఘాతిఁ బరధన
హారణపరునిఁ జంపి పుణ్యుఁ డగు నృపా 50

క॥ ధనమునకై ధర్మము దెస
ననాదరము సేసెనేని నానృపతికి న
ద్ధనమును జెడు దుర్యశముం
బనుగొనుఁ దుది దుర్గతియును బాటిలు ననఘా 51

క॥ ఇచ్చునదె విద్య రణమునఁ
జొచ్చునదె మగతనంబు సుకవీశ్వరుల౯
మెచ్చునదె నేర్పు వాదుకు
వచ్చునదే కీడు సుమ్ము వసుధను సుమతీ 52

క॥ ఇమ్ముగఁ జదువని నోరును
నమ్మా యని పిలిచి యన్నమడుగని నోరుం
దమ్ములఁ బిలువని నోరును
గుమ్మరి మను ద్రవ్వినట్టి గుంటర సుమతీ 53

క॥ ఉదకము ద్రావెడు హయమును
మొదమున నుప్పొంగుచుండు మత్తేభంబు౯
మొదవు కడ నున్న వృషభముఁ
జదువని యానీచుకడకుఁ జనకుర సుమతీ 54

క॥ ఉపమింప మొదలు తియ్యన
కపటం బెడనెడను జెఱకు కైవడినే పో

నెపములు వెదకును గడపటఁ
గపటవు దుర్జాతి పొందు గదరా సుమతీ 55

క॥ ఓడల బండ్లును వచ్చును
ఓడలు నా బండ్ల మీఁద నొప్పుగ వచ్చుఁ
ఓడలు బండ్లును వలెనే
వాడంబడుఁ గలిమి లేమి వసుధను సుమతీ 56

క॥ చుట్టములు గాని వారలుఁ
జుట్టములము నీకటంచు సొంపు దలిర్పన్
బెట్టుకొని యాశ్రయింతురు
గట్టిగ దరిద్రంబు గలుగఁ గదరా సుమతీ 57

క॥ తడ వోర్వక యొడ లోర్వక
కడు వేగం బడిచిపడినఁ గార్యం బగునే
తడ వోర్చిన నొడ లోర్చినఁ
జెడిపోయిన కార్య మెల్లఁ జేకుఱు సుమతీ 58

క॥ తనయూరి తపసితనమును
దనపుత్త్రుని విద్య పెంపుఁ దనసతిరూపుం
దనపెరటి చెట్టు మందును
మనసున నర్ణింప రెట్టి మనుజులు సుమతీ 59

క॥ తనవారు లేని చోటను
జన వించుక లేనిచోట జగడముచోటన్
అనుమానమైన చోటను
మనుజునకును నిలువఁ దగదు మహిలో సుమతీ 60

క॥ ధీరులకుఁ జేయు మే లది
సారం బగు నారికేళసలిలము భంగిన్
గౌరవమును మఱి మీఁదట
భూరి సుఖావహము నగును భువిలో సుమతీ 61

క॥ నయమునఁ బాలుం ద్రావరు
భయమ్మునను విషమ్మునైన భక్షింతురు గా
నయ మెంత దోసకారియొ
భయమే చూపంగ వలయు బాగుగ సుమతీ 62

క॥ నవ్వకుమీ సభలోపల
నవ్వకుమీ తల్లిదండ్రి నాథులతోడన్
నవ్వకుమీ పరసతితో
నవ్వకుమీ విప్రవరుల నయ మగు సుమతీ 63

క॥ పతికడకుఁ దన్నుగూర్చిన
సతికడకును వేల్పుకడకు సద్గురుకడకున్
సుతుకడకు రిత్తచేతుల
మతిమంతులు చనరు నీతిమార్గము సుమతీ 64

క॥ పాలను గలిసిన జలమును
బాలవిధంబుననె యుండుఁ బరికింపంగాఁ
బాలచవిఁ జెఱచుఁ గావునఁ
బాలసుఁ డగువానిపొందు వలదుర సుమతీ 65

క॥ మండలపతి సముఖంబున
మెండైన ప్రధాని లేక మెలఁగుట యెల్లం

గొండొంత మదపుటేనుఁగు
తొండము లేకుండినట్లు దోఁచుర సుమతీ 66

క॥ మంత్రిగలవాని రాజ్యము
తంత్రము సెడ కుండ నిలుచుఁ దఱచుగ ధరలో
మంత్రివిహీనుని రాజ్యము
జంత్రపుఁగీ లూడినట్లు జరుగదు సుమతీ 67

క॥ మానఘనుం డాత్మధృతి చెడి
హీనుం డగువాని నాశ్రయించుట యెల్లన్
మానేఁడు జలముల లోపల
నేనుఁగు మెయి దాఁచినట్టు లెఱుఁగుర సుమతీ 68

క॥ రా పొ మ్మని పిలువని యా
భూపాలునిఁ గొల్వ భుక్తి ముక్తులు గలవే
దీపంబు లేనియింటను
జేపునికి ల్లాడినట్లు సిద్ధము సుమతీ 69

క॥ రూపించి పలికి బొంకకు
ప్రాపగుచుట్టంబు నెగ్గుపలుకకు మదిలోఁ
గోపించురాజుఁ గొల్వకు
పాపపు దేశంబు సొరకు పదిలము సుమతీ 70

క॥ లావు గలవానికంటెను
భావింపఁగ నీతిపరుఁడు బలవంతుండౌ
గ్రావం బంత గజంబును
మావటివాఁ డెక్కి నట్లు మహిలో సుమతీ

క॥ వఱదైనచేను దున్నకు
కఱవైనను బంధుజనుల కడ కేఁగకుమీ
పరులకు మర్మము సెప్పకు
పిఱికికి దళవాయితనము పెట్టకు సుమతీ. 72

క॥ వరిపంట లేని యూరును
దొరయుండని యూరు తోడుదొరకని తెరువుల్
ధర నృపతి లేని గృహమును
నరయంగా రుద్రభూమి యనఁదగు సుమతీ. 73

క॥ శుభముల నొందని చదువును
నభినయముగ రాగరసము నందని పాటల్
గుభగుభలు లేని కూటమి
సభ మెచ్చనిమాట లెల్లఁ జప్పన సుమతీ. 74

క॥ స్త్రీలయెడ వాదు లాడకు
బాలురతోఁ జెలిమి చేసి భాషింపకుమీ
మేలైన గుణము విడువకు
మేలినపతి నింద సేయ కెన్నఁడు సుమతీ. 75

క॥ పుత్రోత్సాహము తండ్రికిఁ
బుత్రుఁడు జన్మించినపుడె పుట్టదు జనులా
పుత్రునిఁ గనుఁగొని పొగడఁగఁ
బుత్రోత్సాహంబు నాఁడు పొందుర సుమతీ. 75

ఆ॥ ఆత్మశుద్ధి లేని యాచార మది యేల
భాండశుద్ధి లేని పాక మేల

చిత్తశుద్ధి లేని శివపూజ లేలరా
విశ్వదాభిరామ వినుర వేమ 77

ఆ॥ నిండు నదులు పాఱు నిలిచి గంభీరమై
వెఱ్ఱివాఁగు పాఱు వేగఁ బొర్లి
అల్పుఁ డాడు రీతి నధికుండు నాడునా—వి॥ 78

ఆ॥ నేర నన్నవాఁడు నెఱజాణ మహిలోన
నేర్తు నన్నవాఁడు నింద చెందు
ఊరకున్నవాఁడె యుత్తమ యోగిరా—వి॥ 79

ఆ॥ పూజ కన్న నెంచ బుద్ధి నిదానంబు
మాట కన్న నెంచ మనసు దృఢము
కులము కన్న మిగుల గుణము ప్రధానంబు—వి॥ 80

ఆ॥ కులములోన నొకఁడు గుణహీనుఁ డుండినఁ
గులము చెడును వానిగుణము వలన
ఎలమిఁ జెఱకు నందు వెన్ను వెడలినట్లు—వి॥ 81

ఆ॥ ఉత్తముని కడుపున నోగు జన్మించిన
వాఁడె చెఱుచు వానివంశ మెల్లఁ
జెఱకు వెన్ను పుట్టి చెఱుపదా తీపెల్ల—వి॥ 82

ఆ॥ వేఱుపురుగు చేరి వృక్షంబుఁ జెఱుచును
జీడపురుగు చేరి చెట్టుఁ జెఱుచుఁ
గుత్సితుండు చేరి గుణవంతుఁ జెఱుచురా—వి॥ 83

ఆ॥ హీనగుణము వాని నిలు సేర నిచ్చిన
ఎంత వానికైన నిడుము గలుగు
ఈఁగ కడుపు చొచ్చి యిట్టట్టు సేయదా—వి॥ 84

ఆ॥ హీనుఁ డెన్నివిద్య లిలను నేర్చినఁ గాని
ఘనుఁడు గాఁడు హీనజనుఁడె గాని
పరిమళములు గార్దభము మోయ గజమౌనె—వి॥ 85

ఆ॥ ఎంత చదువు చదివి యేనీతి విన్నను
హీనుఁ డవగుణంబు మానఁ డెందు
బొగ్గు పాలఁ గడుగఁ బోవునా మలినంబు—వి॥ 86

ఆ॥ చదువు లన్ని చదివి చాల వివేకియై
కలుషచిత్తుఁడైన ఖలుని గుణము
దాలిగుంట వేఁపి తలఁచెడి చంద మౌ—వి॥ 87

ఆ॥ వేము పాలు వోసి ప్రేమతోఁ బెంచినఁ
జేఁదు విఱిగి తీపు జెందఁ బోదు
ఓగు నోగె గాక యుచితజ్ఞుఁ డెటులౌను—వి॥ 88

ఆ॥ పాలు పంచదార పాపరపండ్లలోఁ
జాలఁ బోసి వండఁ జవికి రాదు
కుటిల మానవునకు గుణ మేల గల్గురా—వి॥ 89

ఆ॥ కానివానితోడఁ గలసి వర్తించిన
హాని వచ్చు నెంతవానికైనఁ
దాటిక్రిందఁ బాలు త్రాగిన విధమౌను—వి॥ 90

ఆ॥ పాలు నీడిగింటఁ గ్రోలుచు నుండెనా
మనుజు లెల్లఁ గూడి మద్య మండ్రు
నిలువఁ దగనిచోట నిలువ నిందలు వచ్చు—వి॥ 91

ఆ॥ మాటలాడఁ జేసి మనసు రాజిలఁ జేసి
పరఁగఁ బ్రియము చెప్పి బడలకున్న
నొకరిచేతి సొమ్ము లూరక వచ్చునా — వి॥ 92

ఆ॥ వాన గురియకున్న వచ్చును క్షామంబు
వాన గురిసె నేని వఱద పారు
వఱద కఱవు రెండు వరుసతో నెఱుఁగుఁడీ — వి॥ 93

ఆ॥ వాన రాకడయును బ్రాణంబు పోకడ
కానఁబడ దదెంత ఘనునికైనఁ
గానఁబడినమీఁదఁ గలి యెట్లు నడచురా — వి॥ 94

ఆ॥ ఎన్ని చోట్లు తిరిగి యేపాట్లు పడినను
అంట నియ్యక శని వెంటఁ దిరుగు
భూమి క్రొత్తలైన భుక్తులు క్రొత్తలా — వి॥ 95

ఆ॥ చిక్కియున్న వేళ సింహంబు నైనను
బక్క కుక్క కఱచి బాధ చేయు
బలిమిలేని వేళఁ బంతంబు చెల్లదు — వి॥ 96

ఆ॥ పనసతొనలకన్నఁ బంచదారలకన్న
జుంటి తేనెకన్న జున్నుకన్నఁ
జెఱుకురసముకన్నఁ జెలిమాట తీపురా — వి॥ 97

ఆ॥ చెప్పులోని ఱాయి చెవిలోని జోరీఁగ
కంటిలోని నలుసు కాలిముల్లు
ఇంటిలోని పోరు నింతింత గాదయా — వి॥ 98

ఆ॥ కనకపర్వతమునఁ గాపురం బుండియు
అనిమిషేశ్వరునకు నాశపోదు
కనకకుండలములు కర్ణుని వేఁడఁడా—వి॥ 99

ఆ॥ అస్థిరంబగుమేను నధికప్రేమముతోడఁ
బెక్కుదినము లిలను బెంచి పెంచి
అగ్ని కిచ్చు లేక యుడవినక్కల కిచ్చు—వి॥ 100

ఆ॥ మ్రాను దిద్ద వచ్చు మఱి వంకలేకుండ
దిద్దవచ్చు ఱాయి తిన్నఁగాను
మనసు దిద్దరాదు మహి నెంతవారికి—వి॥ 101

క॥ విదళింప నుఱుకు సింగపుఁ
గొదమయు మదమలిన గండకుంజరములపై
నిది బలశాలికి నైజము
గద తేజోనిధికి వయసు కారణమగునే. 102

తే॥ కుసుమగుచ్ఛంబునకుఁ బోలెఁ బొనఁగు శౌర్య
మానవంతుని కివి రెండు మహితగతులు
సకలజనమస్తక ప్రదేశముల నైన
వనమునం దైన జీర్ణభావంబుఁ గనుట 103

తే॥ అమరుఁ జెవి శాస్త్రమునఁ గుండలమునఁ గాదు
వలయమున నొప్పు దీవిచే వెలయుఁ బాణి
యురుగుణాఢ్యుల మేను పరోపకార
కలన రాణించు గంధంబు వలనఁ గాదు. 104

తే॥ తనిసిరే వేల్పు లుదధి రత్నములచేత
వెఱచిరే ఘోరకాకోల విషముచేత
విడచిరే యత్న మమృతము వొడముదనుక
నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు. 105

తే॥ ఖండితం బయ్యు భూజంబు వెండి మొలచు
క్షీణుఁ డయ్యును నభివృద్ధిఁజెందు సోముఁ
డివ్విధమున విచారించి యెడలు దెగిన
జనములకుఁ దాప మొందరు సాధుజనులు. 106

క॥ కందుకమువోలె సుజనుఁడు
గ్రిందంబడి మగుడ మీఁదికి న్నెగయుఁ జుమీ
మందుఁడు మృత్పిండము వలెఁ
గ్రిందంబడి యణఁగి యుండుఁ గృపణత్వమునన్. 107

తే॥ ఎవ్వనికి నిజ్జగంబున నెంతఫలము
దైవకృత మగు నది పొందుఁ దప్ప కతనిఁ
గారణము గాదు పెనుఁబ్రాపు ఘనునిఁ జేరు
చాతకమువాతఁ బడు నల్పజలకణములు. 108

సమాప్తము.

---